# శ్రీ కృష్ణ శతకము.



ఇది పూర్వపు కృష్ణశతకముకాదు. శ్రీ మహాభాగవతములో దశమస్కంధమునందుగల శ్రీకృష్ణునిచరిత్రలోనియంశములు ఒక్కొకపద్యములో నొకయంశము వచ్చునట్లు బాలురకు, భక్తులకు, నుపయుక్తముగా వ్రాయబడిన చిన్నిపొత్తము. ఇకముందు కొద్దికాలములో నీపుస్తకము అర్థతాత్పర్యములతోడను విశేషాంశములతోడను ప్రకటింపబడును.

సీతారాం అండ్ కో,

బుక్కు సెల్లర్సు,

తెనాలి.

# శ్రీ కృష్ణ శతకము

గ్రంథకర్త:

సుబ్రహ్మణ్య భాగవతులు బి. ఏ.,



ప్రకాశకులు:

సీతారాం అండ్ కో,

తెనాలి.




శైలా ముద్రాక్షరశాల, తెనాలి.




[వెల 0-1-6

# శ్రీ కృష్ణ శతకము



శ్రీ వసుదేవునికృపామున । దేవకిగర్భమున సకల •
దేవతలు వరలి । నీవేదిక్కని కొలువగ ।
నావిర్భవమైన దేవ • యచ్యుతకృష్ణా ॥ ౧ ॥

ఒకచోట జననమును వే । రొకచోటను పోషణంబు •
నొప్పగను యశో । దకు నాదునకును ముద్దుల ।
సుకుమారుడవైన బాల • సుందర కృష్ణా ॥ ౨ ॥

అష్టమగర్భమువలనను । కష్టమ్ములు గలుగుననుచు •
కంసుడు భీతిని । దుష్టుండై నీ యన్నల ।
కష్టాత్ముడు చంపె జాలి • గానక కృష్ణా ॥ ౩ ॥

చను బాలిచ్చెదనని పూ । తన సి చెంతకును జేర •
దానియసురులన్ । చను బాలతోడ బీల్చిన ।
ఘనుడవు నీశక్తి నెన్న • గలమే కృష్ణా ॥ ౪ ॥

మూడు నెలల బాలుడవై । నాడల యాదవులు వింత •
పడగ పడకపై । నాడుచు పదమున శకటము ।
గూలంగాదన్ని ముద్దు • కొమరుడ కృష్ణా ॥ ౫ ॥

సుడిగాలి రూపమున నిను । వడి వడి గొనుచున్ వధింప •
వచ్చిన దనుజున్ । మెడ బిగియబట్టి నేలం ।
బడద్రోసి వధించు చిన్ని • పాపడ కృష్ణా ॥ ౬ ॥

బాలుడవై వ్రేపల్లెను । బాలురతో కలిసి మెలసి •
బహువిధముల నీ । వే లీల నాడుకొంటివి ।
ఆలీల లనంతములు మహా • త్మా కృష్ణా ॥ ౭ ॥

నీపాపని దుండగముల । కోపగ లేమమ్మ యనుచు •
గోపికలు చనగ । గోపికలు మొరలు పెట్టగ ।
నేపాపము నెరుగనటు న • టింతువు కృష్ణా ॥ ౮ ॥

మన్ను దినగని యశోదయు । అన్నా యిదియేమి యనుచు •
నాగ్రహపడగా । చిన్నారి మోము లోపల ।
నన్నిజగమ్ములను జూప • వా శ్రీకృష్ణా ॥ ౯ ॥

అల్లరి బాలుడవనుచును । తల్లి నినుణ్ రోల గట్టి •
దండించగ నా । తల్లి గనకుండ లాగుచు ।
చల్లగ మద్దులనుగూల్చు • జాణవు కృష్ణా ॥ ౧౦ ॥

గోపకుమారులు క్రేపుల । మేపుచు యమునాతటమున •
మెలగెడు వేళన్ । క్రేపులలో క్రేపగు నొక ।
పాపపురక్కసుని గూల్చు • బాలుడ కృష్ణా ॥ ౧౧ ॥

బక దైత్యుడు నిను మ్రింగగ । నకటా యని మిత్రులెల్ల •
నాక్రోశింపన్ । బకు మోము వెడలి వానిన్ ।
వికలాంగుని జేసి చంపు • వీరుడ కృష్ణా ॥ ౧౨ ॥

తన యన్న బకుని జంపితి । వని పటురోషంబుతోన •
ఘాసురుడంతన్ । పెనుబామై నిను నమ్మిన
జను[illegible]ంగింప వాని • జంపవె కృష్ణా ॥ ౧౩ ॥

చిక్కములు చలిదిమూటలు । నక్కన గురువింద పేరు ।
లమరు సఖులతో । చక్కగ వేణువునూదుచు ।
మక్కువ గోవులనుగాయు • మాధవ కృష్ణా ॥ ౧౪ ॥

నడుచుచు నాడుచు పాడుచు । వడి వడి డాగుచును వచ్చి ।
పైనబడుచు సం । దడిజేయుచు చలిది భుజిం ।
చెనువిధముల నెన్నదరమె • చిత్రము కృష్ణా ॥ ౧౫ ॥

చలుదుల సందడిలో లే । గల బాలుర కమలభవుడు ।
గైకొనిదాచన్ । సలలితముగ నా రూప ।
ములదాల్పవె బ్రహ్మనిన్ను • పొగడగ కృష్ణా ॥ ౧౬ ॥

వనమున తాళ ఫలమ్ముల । ననువుగ భక్షింపగోరు ।
యాదవులకు భీ । తిని గొలుపు ధేనుకాసురు ।
ననుచరులను గూల్చిబ్రోచు • హరి శ్రీ కృష్ణా ॥ ౧౭ ॥

కాళింది మడుగులోపల । వ్యాళంబందఱను గఱచి ।
బాధలుపెట్టన్ । కాళియు పడగలపైన మ ।
హా లీలలనాడి బాధ • లణపవె కృష్ణా ॥ ౧౮ ॥

మడుగును వెడలెదు నినుగని । పడతులు గోపకులు చింత ।
బాసిచనుచు నా । యడవిని కార్చిచ్చునబడి ।
మిడుతలవలెగుంద చిచ్చు • మ్రింగవె కృష్ణా ॥ ౧౯ ॥

చెలువలు జలకమూలాడగ । వలువలు గట్టునయిుంచి ।
వారిజోరగ నా । వలువలుగొని చెట్టెక్కిన ।
బలుకొంటె [illegible] • వత్సల కృష్ణా ॥ ౨౦ ॥

పొలముల గోవ్రజ మేపుచు । నలసిన బాలురకు నన్న •
మడుగగ ముని భా । ర్యలు భక్ష్యభోజ్యములు పు ।
ష్కలముగ నర్పింపగొనవె • కరుణన్ కృష్ణా ॥ ౨౧ ॥

ప్రతియేట జరుగు నింద్రుని । క్రతువును మాన్పించి కొండ •
గట్టుకు పూజల్ । చతురత సలుపుచు నా ప ।
ర్వతమై విందారగించు • ప్రభుడవు కృష్ణా ॥ ౨౨ ॥

మండిపడుచు దేవేంద్రుడు । ఖండముగా ఱాళ్ళవాన •
కల్పించగ గో । మండలముగావ కేలను ।
కొండను గొడుగువలెనెత్తు • కర్తవు కృష్ణా ॥ ౨౩ ॥

వరుణుని భృత్యుడు నందుని । వరుణపురమ్మునకు జేర్ప •
భక్తికి పరమా । దరమున వదల్చి తండ్రికి ।
పరమపదముజూపు భక్త • పాలన కృష్ణా ॥ ౨౪ ॥

వెన్నెలలో మురళిని గొని । తిన్నగ నదికేగి యిసుక •
తిన్నెలమీదన్ । కన్నెలు గోవులు పాములు
పన్నుగ పరవశమునంద • పాడవె కృష్ణా ॥ ౨౫ ॥

భాసురముగ నా గోపవి । లాసవతులు నడుమ మండ •
లమ్ముగ నిలువన్ । వాసిగ పలురూపులతో ।
రాసక్రీడలచరించి • రంజిలు కృష్ణా ॥ ౨౬ ॥

సర్పమ్మొక్కటి నందుని । దర్పమ్మున మ్రింగ పాద •
తాడనమున కం । దర్పసమదేహుజేయుచు ।
సర్పపు శాపమ్ము బాపు • సదయుడ కృష్ణా ॥ ౨౭ ॥

మురదళిని వినవచ్చెను సుం । దరులను గొని యక్షుడొకడు ♦
తత్తరమున ను । త్తరదిశకు జనగ వానిని ।
శిరమున-మణిలాగి ద్రుంచు ♦ జెట్టివి కృష్ణా ॥ ౨౮ ॥

గోవుల లేగల దఱుముచు । గోవృషదైత్యుండు మంద ♦
కుఁ వడిరాగా । నా వృషభాసురు కొమ్ముల ।
చేవంగొని నేలగొట్టు ♦ శ్రీహరి కృష్ణా ॥ ౨౯ ॥

కేశియనెడు నశ్వాసురు । నాశగొనుచు కంసుడంప ♦
నతిభీకరుడా । నాశత్రుని మాయలతో ।
కేశవ వాని మదమణచి ॥ గెడపవె కృష్ణా ॥ 30 ॥

ఆటలలో గోపకులను । పోటుతనమ్మున హరించి ♦
వ్యోమాసురుడా । చాటున గుహలో దాచిన ।
వాటముగా వాని ద్రుంచు ♦ వరదుడ కృష్ణా ॥ 3౧ ॥

నారదుని పలుకులను విని । క్రూరుండా కంసు డధిక ♦
కోపముతో న । క్రూరు ధనుర్యాగంబను ।
పేరట నినుబిల్వనంప ♦ వెడలవె కృష్ణా ॥ 3౨ ॥

యమునా నదిలోపల నీ । విముమధ్యను నిన్ను గాంచి ♦
రథమున నీ రూ । పముగని యత్యంతానం ।
దము నక్రూరుండుగనడె ♦ ధన్యుడు కృష్ణా ॥ 33 ॥

పురకాంతలు నీ యందము । నరసి విరులవాన గురియ ♦
నరుగుచు మధురా । పురమున చాకలి యొద్దను ।
సురుచిర వస్త్రములగొనెడు ♦ శూరుడ కృష్ణా ॥ 3౪ ॥

వాయక సుదాముఁ డొసఁగిన । వాయర్చన లంది కుబ్జ •
యనెడు త్రివక్రన్ । చే యొత్తిలాగి సుతనుం ।
జేయుచు చందనము లందు • చెలువుఁడ కృష్ణా ॥ ౩౫ ॥

ధనువు నవలీల విఱిచితి । వనుచును నీపైన కువల •
యాపీడంబున్ । దనుజుడు పంపగ దంతము ।
లను బెఱికి వధించు వీర • లక్షణ కృష్ణా ॥ ౩౬ ॥

తల్లడమందుచు కంసుం । డుల్లంబునఁ గలఁగ మల్ల •
యుద్ధమునందున్ । బల్లిదుల ముష్టికాదుల ।
మల్లనరుల ద్రుంచు గీర్తి • మండన కృష్ణా ॥ ౩౭ ॥

గరుడుఁడు పాము శిరంబును । కరమునఁ దుగబట్టి యీడ్చు •
కరణిని కంసున్ । వరసింహాసనగతుఁ డై ।
బిరబిరలాగి తెగటార్చు • వెన్నుఁడ కృష్ణా ॥ ౩౮ ॥

నిను హింసించిన రాక్షస । జనులకు నైక్యంబుగలిగె •
సర్వము నీకే । యనువుగ నిచ్చిన గోపాం ।
గనలకు నీవేమి యొసగ • గలిగితి కృష్ణా ॥ ౩౯ ॥

కనుచింతించెడు కంసుని । పడతులనోదార్చి చెఱల
బడిన పితరులన్ । విడిపించి యుగ్రసేనుని ।
పుడమికి పట్టమ్ముగట్టు • పుణ్యుఁడ కృష్ణా ॥ ౪౦ ॥

గురువుల కెల్లను గురువై । వరలెడు నీవొక్క విప్రు •
నర్యుని యింటన్ । గురుశిష్యన్యాయముతో ।
గురుమతి విద్యలను నేర్చు • కొంటివి కృష్ణా ॥ ౪౧ ॥

గురుదక్షిణకొఱకై సా | గరమున నా పంచజనుని •
కాయమునంటన్ | వరశంఖము గైకొని యమ |
పురి గురుసుతు దెచ్చియిచ్చు • ప్రోడవు కృష్ణా ॥ ౪౨ ॥

తన సుతలు కంసు భార్యలు | తను ప్రేరణ జేయ సప్త •
దశవారంబుల్ | నిను బాధించు జరాసం |
ధుని యుద్ధమునందు బాఱ • ద్రోలవె కృష్ణా ॥ ౪౩ ॥

జవమున మధురాపురిపై | యవనజరాసంధులిరువు •
రేగెదరని యా | దవులను రక్షింపగ ద్వా |
రవతిని మున్నీటగట్టు • రక్షక కృష్ణా ॥ ౪౪ ॥

చలమున నీ వెంబడిబడి | యలయక పరుగెత్తు కాల •
యవనుని గుహలో | పల ముచికుందుని కనుమం |
టలపాలొనరించు లోక • నాయక కృష్ణా ॥ ౪౫ ॥

నీదర్శనభాగ్యముకై | సాదరముగ నిద్రఁజెందు •
నా ముచికుందున్ | నీ దివ్యరూపదర్శన |
మోదంబున దేల్చు భక్త • పూజిత కృష్ణా ॥ ౪౬ ॥

బలరాముఁడు నీవును మీ | బలదర్పములుడిగి చన ప్ర •
వర్షణగిరిపై | నల్దెసల మగధుఁ డగ్నిని |
నెలకొల్పిన దూకిపఱచు • నిపుణుఁడ కృష్ణా ॥ ౪౭ ॥

శిశుపాలున కిచ్చెదరని | విశదమ్ముగ దెలిసి యొక్క •
విప్రుని బంపన్ | దిశల యశము నిండగ నీ |
వశమున రుక్మిణిని గొనెదు • ప్రభుఁడవు కృష్ణా ॥ ౪౮ ॥

దక్షుడవై రాజేంద్రులు । వీక్షింపగ భీష్మసుతను •
వేగమె దయతోఁ । రాక్షసవివాహమ్మునఁ గొను ।
సాక్షాద్విష్ణుడవు దేవ • సన్నుత కృష్ణా ॥ ౪౯ ॥

సరివాడవుగావని నిను । విరసమ్ముగ రుక్మి తాక •
వీరుడవై పో । దరి పార్థింపగ వానిని ।
శరము విరూపునిగ జేసి • కాచెదు కృష్ణా ॥ ౫౦ ॥

పురుటింటి బాలుఁగొని శం । బరుడు సముద్రమున వేయ •
మత్స్యము మ్రింగన్ । దొరికి పెరిగి యా శంబరు ।
బరిమార్చినమరుని గన్న • వాడవు కృష్ణా ॥ ౫౧ ॥

మణికై వచ్చిన యపనిం । దను బాపగ జాంబవంతు •
దర్పమడచి యా । మణియును నిరువురు కన్యా ।
మణులను గైకొన్న మేటి • మగడవు కృష్ణా ॥ ౫౨ ॥

పుత్రిక నొసంగ లేదని । సత్రాజితు గొంతుగోసి •
చనుచున్ మణినిన్ । మిత్రునికిడు శతధన్వ న ।
పాతుని దెగటార్చి మణిని • బడసిన కృష్ణా ॥ ౫౩ ॥

కాళిందీజలములలో । కాలాత్మజుడైన సూర్య •
కన్యక యగు నా । కాళింది తపము జేయఁగ ।
నా లలితాంగిని వరించు • యదువర కృష్ణా ॥ ౫౪ ॥

వృషభమ్ముల నేడింటిని । విషమస్థలమందు జనులు •
వేడుకగన పౌ । రుషమున బంధించిన యదు ।
వృషభుండవు నాగ్నజితికి • ప్రియుడవు కృష్ణా ॥ ౫౫ ॥

శ్రీ రుక్మిణి జాంబవతియు । వీరయువతి సత్య మిత్ర •
　　విందా భద్రల్ । కాళింది నాగ్నజితి యురు ।
వారలు లక్షణయు అష్ట • భార్యలు కృష్ణా　　॥ ౫౬ ॥

సురకంటకుఁడగు నరకుని । దురమున బరిమార్చి సత్య •
　　తోఁగూడి యుటఁ । దరుణుల బదాఱువేలను ।
పరిణయమగు సర్వలోక • భర్తవు కృష్ణా　　॥ ౫౭ ॥

పురమునకు మరలివచ్చును । సురపతితో బోరి గెలిచి •
　　సుందరతరమగు । వరపారిజాత తరువును ।
గరుడుని పై బెట్టితెచ్చు • ఘనుడవు కృష్ణా　　॥ ౫౮ ॥

నారదుని వాక్యములు విని । ధీరుడు ధర్మజునిచేత •
　　దివ్యమహిమతో । నారాజసూయమఖ మ ।
వ్వారిగ జేయించు యోగి • వందిత కృష్ణా　　॥ ౫౯ ॥

బలిమి జరాసంధుని న । చ్చెలులై యొకరొకరికొలకు •
　　పాలైనములైనఁ । నిడిచెడు హింసడిచిరులఁ ॥
బలునేర్పున్నదుంచు లోక • పాలక కృష్ణా　　॥ ౬౦ ॥

కపట బ్రాహ్మణులై చని । విపులాహవభిక్ష వేడి •
　　భీమునిచే మీ । కపకారి మాగధుని జగ ।
దుపకారముగా వధించు • యోగ్యుడ కృష్ణా　　॥ ౬౧ ॥

అలమాగధుండు భైరవ । బలికై కారాగృహముల •
　　బడ వేసిన రా । జుల విడుదలజేయుచు వా ।
రలచే ప్రార్థనములంది • గ్రాలెడు కృష్ణా　　॥ ౬౨ ॥

తొలుత్ర పూజలనందగ । కులగోత్రము లేని వెట్టి ॥
గొల్లడనుచు దా । వలదనిన తిట్టు చైద్యుని ।
తల చక్రంబున వాటించు ॥ దక్షుడ కృష్ణా ॥ ౬౩ ॥

యతి వేషంబున వచ్చిన । నతిసుందరు డర్జునునకు ॥
ననుజ సుభద్రా । సతి పరిచర్యకు నిలుపుచు ।
నతనికి పరిణయము జేయు ॥ హరి శ్రీ కృష్ణా ॥ ౬౪ ॥

అనలుని చేతను ఖాండవ । వనమును భక్షింప జేయు ॥
వరుణుని చే న । ర్జునునకు చాపము రథమును ।
ఘనచక్రము గదయు నీకు ॥ గైకొను కృష్ణా ॥ ౬౫ ॥

మయుడగ్నిని బడకుండగ । దయతో నర్జునుడు ప్రాణ ॥
దానము జేయగ । మయుచే సభ చేయించి వి ।
జయునకు సభతోడ జయము ॥ సంగాడు కృష్ణా ॥ ౬౬ ॥

సభలోన ధర్మతనయుని । విభవంబు ననూయతోడ ॥
వీక్షించు కురు । ప్రభుని నగుబాటుచే నా ॥
సభ రణబీజముగ నాటు ॥ చతురుడ కృష్ణా ॥ ౬౭ ॥

హా కృష్ణా! యదునందన । నాకెవ్వరు దిక్కులేరు ॥
ననుగావుమనగ । కోకల నక్షయముగ నీ ।
వా కృష్ణకు నొసగి ప్రోవ ॥ వా శ్రీ కృష్ణా ॥ ౬౮ ॥

కౌరవులకు పాండవులకు । వైరమ్ములు మాన్పి ॥ స్నేహ
భావము గలుగగ । పోరువలదని సుయోధను ।
వారింపగ జూచు రాయ ॥ బారివి కృ ష్ణా ॥ ౬౯ ॥

చేతులచాపము జాఱఁగ । భీతింగొను నర్జునునకు ।
ప్రీతిమున భగవ । ద్గీతల నుపదేశించిన ।
నేతవు గద విశ్వరూప ॥ నిలయుడ కృష్ణా ॥ ౨౦ ॥

కురుపతి సుయోధనునకు న । పరిమితమగు సైన్యమొసగి ।
స్వయముగ । నీవే నరునకు సరదము గడపుచు ।
సరగున జయ మొసగు పార్థ ॥ సారథి కృష్ణా ॥ ౨౧ ॥

అభిమన్యుఁ మేనల్లుని । నభిమాన మొకింత లేక ।
యనిలోన కురు । ప్రభువులచే జంపించిన ।
విభుడవు సర్వేశ వేద । వేద్యా కృష్ణా ॥ ౨౨ ॥

చక్రంబు పూననను చు న । వక్రగతి ప్రతిజ్ఞ జేసి ।
పార్థుని పైకి । విక్రమమున భీష్ముడు చన ।
చక్రము చక్రమని యఱచు ॥ సదయుడ కృష్ణా ॥ 23 ॥

ఉత్తర గర్భము లోపల । తత్తరమున బాణశిఖల ।
దగ్ధుడగు పరీ । క్షిత్తును గదచేగాచిన ।
యుత్తమచరితుడవు ప్రణుత ॥ యోగివి కృష్ణా ॥ ౨౪ ॥

నరునకు సారధివై యా । నరవరు కొడుకునకు ప్రాణ ।
నాశకరుడనై । నరు పౌత్రుడగు పరీక్షి ।
న్నరపతి రక్షించు నంద ॥ నందన కృష్ణా ॥ ౨౫ ॥

శరతల్పమందు నీ పద । సరసిజములు మదిని నిల్పి ।
సంకల్పాదుల్ । స్థిరుడై విడిచిన భీష్ముని ।
కరయుగ మోక్షపదమిడవె ॥ యవ్యయ కృష్ణా ॥ ౨౬ ॥

కేళీగృహమున రుక్మిణి । జాలగ విరసోక్తులాడి ◆
సతి ధరణూదగ । వ్రాలిన కరుణాలుఁడవై
జాలిఁగొని మూర్ఛదేర్చు ◆ సరసుఁడ కృష్ణా ॥ ౨౭ ॥

తన కూతురు గూడిన నీ । మనుమని పాశములఁగట్టి ◆
మందిరమును గా । వను శివుని నిల్పుకొను బా
ణుని గర్వమడంచు శంభు ◆ నుతుఁడవు కృష్ణా ॥ ౨౮ ॥

మును దానంబిచ్చిన గో । వును మరల నొసంగ నూప ◆
మానఁబడి పాపం । బున నూసరవెల్లిగ నుం ।
డిన నృగునకు మోక్షమిచ్చు ◆ నేర్పరి కృష్ణా ॥ ౨౯ ॥

తన పేరును తన లక్షణ । మును దాల్చితివనుచు వంత
మున గద చక్రం । బును దాల్చి వడిగ నీపై ।
జను పౌండ్రిక వాసుదేవు ◆ జంపవె కృష్ణా ॥ ౩౦ ॥

జనకుని వధియించిన నా । తని సుతుఁడు సుదక్షిణుండు ◆
దర్పంబున కృ । త్యను బంపగ చక్రంబున ।
ఘనమగు మంటలను దాని ◆ గాల్చవె కృష్ణా ॥ ౩౧ ॥

హరుని కృపవలన సాల్వుఁడు । వర మాత్మ విమానమొకటి ◆
బడసి యాదవులతో । నగు దేర సౌభకముతో ।
నగిపిరుహ శాహుగర్వ ◆ మడఁచిన కృష్ణా ॥ ౩౨ ॥

చెలులగు పౌండ్రిక సాల్వ । దులకును తర్పణముఁ జేసగి ◆
ఘోరపుటలుకఁ । కలహించు దంతవక్త్రుని ।
బలిమిఁ వధియించు చక్రి ◆ పాణివి కృష్ణా ॥ ౩౩ ॥

షోడశ సహస్ర భార్యల । గూడిన నీ మహిమ తెలిసి ◆
గొను కోరికతో । నాడుచు నీ చరితంబుల ।
పాడుచు నారదుడు తుష్టి ◆ బడయడె కృష్ణా ॥ ౭౪ ॥

కడుపేద విప్రుఁ డొసఁగిన । ముడిచిన యటుకులనుఁ జూచి ◆
మోదముతోడన్ । పిడికెడు తిని వానికి తృ ।
ప్తుడవై సంపదల నొసగు ◆ మోహన కృష్ణా ॥ ౭౫ ॥

గ్రహణంబునాడు భార్యా । సహితుడవై తీర్థమందు ◆
స్నానము చేయన్ । మహితాత్ములు రాజులు నీ
మహిమలు గొనియాడ వెలయు । మాధవ కృష్ణా ॥ ౭౬ ॥

గురుసుతుని వెచ్చియిచ్చిన । తెరగున నీ తల్లి కోర్కె ◆
దీర్పఁగ బలిమిం । దిరమున మృతులైన సహో ।
దరులం గొని వచ్చియిచ్చు ◆ దాతవు కృష్ణా ॥ ౭౭ ॥

మునిగణములు నినుఁ గొల్వఁగ । జని మిథిలాపురమునందు ◆
సత్కారములన్ । గొని భూపతికిని విప్రున ।
కును సుజ్ఞానము నొసంగు ◆ గురుడవు కృష్ణా ॥ ౭౮ ॥

శిరమంట భస్మమగునని ! వరమిచ్చిన శివుని వెంట ◆
బడి కనుఁగొనఁగా । పరుగెత్తు వృకుని కడు నే ।
ర్పరివై సమయించు సాధు ◆ వత్సల కృష్ణా ॥ ౭౯ ॥

తనవారు వీరు పరులని । యణుమాత్రము భేదమైన ◆
యమరదు నీకున్ । గనుక నె నీ యాదవకుల ।
మునకును కల్పించినావు ◆ ముసలము కృష్ణా ॥ ౮౦ ॥

యాదవుల మద్యజనితో | న్మాదులను ప్రభాసమందు ♦
మసలెడివారిన్ | వాదములాడుచు చావగ |
మోదుకొనంజేయు దేవ ♦ ముఖ్యుడ కృష్ణా || ౬౧ ||

చరణంబు మీద వేరొక | చరణము నిల్పుచు కదల్చు ♦
సమయమునందున్ | బరువడి కిరాతు డొక్కడు |
శరమేయగ తనువుబాసి – చను శ్రీకృష్ణా || ౬౨ ||

నినుగాంచి వగచుబోయకు | వెనుకటి కర్మంబు దాట ♦
వీలు గలుగునా | యని పలికితి వచ్యుతునకు |
వెనుకటి కర్మంబు నీకు ♦ వెలయును కృష్ణా || ౬౩ ||

ఈ యుర్విబాసి చనునెడ | నాయుద్ధవు డడుగనిన్నా ♦
నతిహర్షముతో | శ్రీయుతమగు పరమార్థము |
నాయనఘున కొసగి చనవె ♦ యవ్యయ కృష్ణా || ౬౪ ||

శుకుడు పరతత్వమగు నీ | యకలంకంబైన చరిత ♦
మంతయు దెలుపన్ ! ప్రకటయశుడు పుణ్యాదరం |
భకుడు పరీక్షిత్తు ముక్తి ♦ బడయడె కృష్ణా || ౬౫ ||

ఏదినమున నవతారము | మేదినిపై మానదలచి ♦
మేను విడిచినా | వాదినము కలియుగంబున !
కాదిగ ప్రారంభమయ్యె ♦ నచ్యుత కృష్ణా || ౬౬ ||

గాండీవము చేతనుండియు | చండ భుజపరాక్రమంబు ♦
చాల గలిగియున్ | దండిసహాయుడవగు నీ
వుండమి నరుడేమిచేయ ♦ నోపడు కృష్ణా || ౬౭ ||

అవని పరువింట బ్రిదుకుట । యవన జరాసుతులకోడి •
యబ్ధిని భీతిఁ । నివసించుట రెండును ను ।
ద్ధవు డతిదుఃఖంబుతోడ • దలచును కృష్ణా ॥౯౮॥

జలధికి చేరువ తనువును । విడిచిన క్షేత్రంబు సకల •
విశ్వమునందుఁ । పలువురు యాత్రలు జేయఁగ
నలఘు జగన్నాథమగుచు • నలరెను కృష్ణా ॥౯౯॥

కొందఱు పగచేతను మఱి । కొందఱు మోహంబుచేత •
కొందఱు భీతిఁ । కొందఱు ప్రేమను నిను మఱి
కొందఱు సద్భక్తి కలిసి • కొందురు కృష్ణా ॥౧౦౦॥

ముల్లుఁగొని ముల్లు దీయుచు । చల్లగ రెంటిని త్యజించు •
చందమున భువిఁ । కల్ల తనువుఁగొని యసురుల ।
కల్లరుల వధించు నిన్నె • కారుడ కృష్ణా ॥౧౦౧॥

క్రూరులగు దుష్టరాక్షస । వీరుల సృజియింపనేల •
పృథివీస్థలిపై । భారము మాన్పుటకై యవ ।
తారము నెత్తఁగనేల • తలఁపగ కృష్ణా ॥౧౦౨॥

నామము రూపము కర్మము । లేమాత్రము లేని నీకు •
నీశునకు భువిఁ । నామము రూపము కర్మము ।
లేమిట గలుగంగవలసె • నెఱుగము కృష్ణా ॥౧౦౩॥

మారియనుచును నినుఁగొందఱు । మారుడనుచుఁ మఱియుకొంద•
ఱార్భింతురుఁ । కరుణించి జన్మ కర్మల ।
మారింపు మెవండపైన • నగధరా కృష్ణా ॥౧౦౪॥

క్రమమున నెఱుఁగుటచె నాకా । శమదూరము శక్తి తెలియ ।
జాలని గతి నీ । కమనీయ లీలలను స ।
ర్వము తెలియఁగ నెవ్వఁడోపు । భవహర కృష్ణా ॥ ౧౦౫ ॥

ధరణిపయి కాలుజాతిన ! ధరణియె చేయూతయగు వి ।
ధంబున నీకును । నిర మపరాధ మొనర్చిన ।
నరునకు శరణంబు నీవె । నాకున్ కృష్ణా ॥ ౧౦౬ ॥

ఘననీలకాంతి కౌస్తుభ । మును పింఛము నాణిముత్తె ।
మును కస్తురి మో । విని వేణువాద్యనాదము
కనుమూసిన విచ్చినపుడు । కనబడు కృష్ణా ॥ ౧౦౭ ॥

అష్టోత్తరశతకందము లిష్టమ్ముగ నీ పదముల ।
కిదె యర్పింతును । సృష్టి స్థితి లయకర నా ।
కష్టమ్ములు మాన్పి నన్ను । గైకొను కృష్ణా ॥ ౧౦౮ ॥

కృష్ణ నీ పదపంకజంబను పంజరంబును నేఁడె । నా
మానసంబను । రాజహంసంబు చేరుగాక ప్రాణముల్
తర్లిపోయెడువేళ శ్లేష్మము వాత పైత్యము లడ్డమై
గొంతు జుట్టుకొనంగ నీ స్మరణంబు నాకెటు లభ్యమా ?

శ్రీ కృష్ణ శతకము సంపూర్ణము.

శ్రీ గోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః

